The First Telugu Bi-weekly in Andhra Desa. The only Telugu Newspaper for H. E. H. The Nizam's Dominions.

# గోల్కొండపత్రిక

సుల్తాను బజారు, హైద్రాబాదు, (దక్కన్.)

ప్రతి సోమ, గురువారములు ప్రకటింపఁబడును

| | | |
|---|---|---|
| సం॥చందాదారూ ౬-౦-౦<br>అర్ధ ,, ,, ౩-౦-౦<br>విడి పత్రిక ౦-౧-౦ | **GOLKONDA PATRIKA**<br>HYDERABAD, (Dn.) THURSDAY 25.4.1935<br>103604 | ప్రాతపత్రికకు<br>వెల ప్రత్యేకము |

సంపుటము ౯ } శా.శ. ౧౮౫౭ శ్రీయువనామసం॥ చైత్ర బ॥ ౭ గురువారము ౨౦-౭-౪౪ ఫ. { సంచిక ౫౯

## వాఙ్మయ గోష్ఠి

### ప్రబుద్ధాంధ్ర సంపాదకుల ఉపన్యాసము

గతమంగళవారము (౨౩-౪-౩౫) నాటి సాయంత్రము శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయంలో శ్రీయుత సి. ఎచ్. లూయిగారి యాధ్యక్ష్యమున తెలుగు కథకులును, ప్రబుద్ధాంధ్రపత్రికాసంపాదకులునగు శ్రీ శ్రీపాదసుబ్రహ్మణ్య శాస్త్రిగారి „వాఙ్మయగోష్ఠి" జరిగెను, ఇది యువజనాంధ్ర సంఘము పక్షమున సమావేశపరుపబడెను.

ప్రప్రథమమున యువజనాంధ్రసంఘ తాత్కాలిక కార్యదర్శులగు శ్రీయుత బి. ఎస్. శెట్టిగారు నాటియుపన్యాసకులను, అధ్యక్షులను ఎఱుకపరుచుచు నేను శ్రీపాదసుబ్రహ్మణ్య శాస్త్రిగారిదర్శనము మనకందరకిని లభించుటయదృష్టమనియు, వీరు ప్రబుద్ధాంధ్రపత్రికా సంపాదకులుగానుండి ఆంధ్రదేశమునకు గావించుచున్న సేవ యపారమనియు, వీరిని ఆంధ్రదేశమంతయు యెఱుగుననియు. వీరియాదర్శము ఆంధ్రదేశవాసులందు ఆంధ్రత్వము, ఆంధ్రజాతీయత్వము గలిగించుటయై యున్నదనియు తెలిపిరి. సమావేశాధ్యక్షులనుగురించి తెలుపుచు ఈసమావేశమున నాప్రార్థనపై శ్రీయుత సి.ఎచ్. లూయిగారధ్యక్షత వహించుట గొప్పకొనినారనియు, వీరు మెథడిస్టు బాయ్స్ హైస్కూలు తెలుగు పండితులనియు, వీరి కాంధ్రభాష యభిమానము మెండనియు. పాఠశాలయందలి విద్యార్థులకు వీరు ఆంధ్రభాషాప్రాముఖ్యతను గోచరింపజేసి వారికిం దభిరుచిగలిగించుటకు విశేషకృషి సలుపుచున్నారనియు, శక్తియొక్కయు, అధ్యక్షులయొక్కయు యాదర్శములు యొకటేయుండుటచే నేటి సమావేశమునకు గొప్పప్రాముఖ్యతగలిగినదనియు తెలిపిరి. అధ్యక్షులను తమ పీఠము నలంకరించి కార్యక్రమము నడుపగోరిరి.

ఉపన్యాసకులవారు ప్రసంగించుచు సందర్భవశమున ఆంధ్రోద్యమమును గూర్చి మాట్లాడుచు యిట్లుచెప్పిరి:—

„ఇంకొక విషయమునుగూర్చి నేను తమకుమనవిచేస్తా. అది ఆంధ్రోద్యమ విషయమైంది. ఆంధ్రోద్యమమంటె ఆంధ్రులు సర్వతోముఖాభివృద్ధి గాంచుటయు, ఆంధ్రజాతిని తిరిగి పూర్వౌన్నత్యమునకు తేవడము, నశించిన పూర్వశక్తి సామర్థ్యాలను సంపాదించుకోవడమునై యున్నది. దీనికిరాజకీయాలతో ఎట్టిసంబంధములేదు. బ్రిటిషిండియాలో ౧౨ జిల్లాలఆంధ్రులు, నిజాంరాష్ట్రంలోని జిల్లాలఆంధ్రులు, మొత్తం ౨౦జిల్లాలందు ఆంధ్రులుంగలరు. ఇప్పుడు వీరిస్థితి యెట్లావున్నాది తెలుసుకోవడం మనముఖ్య విషయం. ఆంధ్రులందు పరస్పరంగా అవమానపరచుకోవడం అలవాటువున్నాది. ఇతర జాతులననుకరించే గుణం హెచ్చుగాగలదు. తెలంగాణాంధ్రులెన్నో, సేనోకవారు గొప్పప్రాంతానికి పరిపాలకులుగా నుండియుంటిని ఆ శోభావము వీరియందు లేకలేదు, ఇట్టి భావశూన్యతను వారు వీడుగాక యింకేమి

## గ్రంథ నిషేధము

"విదర్ హైద్రాబాద్" అను గ్రంథము యి ప్రభుత్వము వారిచే నిషేధింపబడినట్లు తెలియుచున్నది. పోయిన సోమవారమునాడు నగరరక్షకశాఖవారి కార్యాలయమునకు ఆపుస్తకముయొక్క ప్రతులుకట్టలుకట్టలు వచ్చినవని తెలిసినది. పోలీసుశాఖవారు ఆపుస్తకముల నన్నిటిని జప్తు చేసిరట



## కడపటి వార్తలు



G. P. Press.

## హైదరాబాదు బజారు ధరలు

(కోడారపు లక్ష్మీనరసయ్యా ఉస్మాన్ గంజి)

—:o:—

౨౫—౮—౧౩౪౪

—:o:—

| | | పల్లా౧కి | రు.అ. |
|---|---|---|---|
| గోధుమలు బెలాల్యా మేలు | | ,, | 12_8_0 |
| | వరకు | ,, | 12_0_0 |
| బియ్యము దొడ్డువి | మొ॥ | ,, | 13_12_0 |
| ,, జానకరాంలు క్రొత్తవి మే॥ | | ,, | 15_12_0 |
| | వరకు | ,, | 16_0_0 |
| ,, డిటో పాతవి మొ॥ | | ,, | 17_0_0 |
| ,, కృచిసాంబాయలు క్రొత్తవి | | ,, | 15_12_0 |
| ,, రామసాగరాలు క్రొత్తవి | | ,, | 14_4_0 |
| ,, పిహోడిలు | మొదలు | ,, | 14_8_0 |
| కంములు | పెద్దవి | ,, | 9_12_0 |
| కందిపప్పు | పెద్దవి | ,, | 13_8_0 |
| పచ్చపెసలు | | ,, | 12_8_0 |
| పెసరపప్పు | | ,, | 15_0_0 |
| నల్లపెసలు | | ,, | 8_0_0 |
| మినుములు | | ,, | 8_14_0 |
| మినప పప్పు | | ,, | 15_0_0 |
| ఉలవలు | | ,, | 6_12_0 |
| జొన్నలు | | ,, | 9_12_0 |
| శెరిసెనగలు | | ,, | 12_12_0 |
| సెనగలు | | ,, | 10_11_0 |
| సెనగపప్పు | | ,, | 13_12_0 |
| పుప్పు | | ,, | 12_0_0 |
| తవుడు | | ,, | 4_12_0 |
| పత్తిగింజలు | | ,, | 8_0_0 |
| ఆలచందలు | | ,, | 11_4_0 |
| ఆనుములు | | ,, | 8_4_0 |
| బటాణాలు | మొ॥ | ,, | 9_8_0 |
| బెల్లము | | ,, | 18_0_0 |
| ఎఱ్ఱచక్కెర | | ,, | 20_0_0 |
| తెల్లచక్కెర | | ,, | 13_0_0 |
| మద్రాసు చక్కెర | దొడ్డువి | ,, | 18_4_0 |
| వేరుసెనగగింజలు చిన్నవి | | ,, | 17_0_0 |
| పసుపు | | ,, | 15_0_0 |
| మిరపకాయములు | మొదలు | ,, | 35_0_0 |
| | వరకు | ,, | 36_0_0 |
| చింతపండు | మొ॥ | ,, | 14_0_0 |
| కొత్తది | వరకు | ,, | 14_4_0 |
| మెంతులు మంచివి ౧౬ సేర్లకు | | | 2_0_0 |
| అల్లం | ౧౨ సేర్లకు మొదలు | | 1_8_0 |
| వేరుసెనగనూనె | ౧౨ ,, | | 4_3_0 |
| నెయ్యి | ౪౦ ,, | | 50_0_0 |
| తెల్లగడ్డలు | ౧౨ ,, మొ॥ | | 1_4_0 |
| ఎఱ్ఱగడ్డలు | పల్లా౧కి మొ॥ | | 8_12_0 |

## అగ్ని ప్రమాదము

ఫత్తేర్‌ఘట్టిలో నంబర్ [౧౩౬౫]గల ఒక మోటరు కారుకు ౧౫ఖుర్దాదు౧౩౪౪ సాలునాడు సాయంత్రము తొమ్మిది గంటలకు నిప్పంటుకొనెను.

## అన్యరాష్ట్రీయులగు మతప్రచారకులకు హెచ్చరిక

మ. ఘ. వ. ప్రభువుగారిఆజ్ఞ నిజాం ప్రభుత్వమువారు యీక్రింది ప్రకటన ప్రకటనశాఖవారి ద్వారాపంపినారు:—

"మ. ఘ. వ. ప్రభువుగారి ఫర్మానుబట్టి యిందుమూలమున ప్రజలకు తెలియబరుచుటయే మనగా, యీరాష్ట్రము వెలుపలనుండియే మత ప్రచారకుడుగాని, షియాకానీ సున్నీకానీ, శేక్, "గైర్ముకాల్లిదే" గాని, అహమ్మదీగానీ, యెవ్వడుగాని ప్రభుత్వమతశాఖవారినుండి ముందుగా అనుమతి సంపాదించక యీరాష్ట్రములోకి ప్రవేశించరాదు. అట్టిప్రచారకులను సంస్థానములో నెవరుగాని పిలపించుచో ఆపిలపించు వారిపైననే ఆదాధ్యతయుండును."



## నిజాంరాష్ట్రమందు ధరలు

౧౩౪౪ ఫసలీ అర్దిబెహిష్తు మొదటి పక్షములో నిజాం రాష్ట్రమందు నగరములోను, వివిధ జిల్లాలలోను ధాన్యాదులధర లెట్లుండెనో క్రింది పట్టికవలన తెలియవగును. హాలీ సికాయ ౧ కి ఎన్ని శేర్లు, చటాకులు ఉండెనో తెలుపబడినవి.

| జిల్లాలు | మొరటురకపు బియ్యము | మొదటిరకపు వడ్లు | రెండవరకపు వడ్లు | గోధుమలు | జొన్నలు | సజ్జలు | రాగులు | మొక్క జొన్నలు | ఉలవలు | ఉప్పు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| హైదరాబాదు నగరము | 7_ 8 | ...... | ... | 8_ 0 | 9_ 8 | 12_ 0 | ... | ... | 11_ 0 | 9_ 0 |
| వరంగల్లు | 8_ 1 | 16_ 4 | 18_ 8 | 7_ 1 | 13_ 0 | 12_ 5 | ... | 13_ 0 | 8_ 10 | 9_ 3 |
| కరీంనగరు | 8_ 4 | 15_ 3 | 16_ 15 | 8_ 8 | 12_ 0 | ...... | ... | 11_ 6 | 10_ 14 | 9_ 5 |
| ఆదిలాబాదు | 8_ 9 | 15_ 2 | 17_ 5 | 9_ 5 | 14_ 0 | ...... | ... | 11_ 5 | 11_ 4 | 8_ 3 |
| మెదకు | 7_ 3 | 16_ 0 | 17_ 11 | 9_ 11 | 11_ 8 | 11_ 0 | 10_ 0 | 9_ 0 | 10_ 4 | 8_11 |
| నిజామాబాదు | 8_ 8 | 15_ 1 | 16_ 10 | 10_ 13 | 12_ 9 | ...... | ...... | 13_ 8 | 11_ 9 | 9_ 0 |
| మహబూబునగరు | 7_ 5 | 16_ 6 | 18_ 0 | 6_ 7 | 11_ 7 | 11_ 6 | 16_ 4 | ... | 8_ 13 | 8_ 0 |
| నల్గొండ | 7_ 9 | 14_ 12 | 16_ 1 | 6_ 11 | 11_ 5 | 11_ 6 | ... | 11_ 0 | 7_ 8 | 9_ 8 |
| ఔరంగాబాదు | 7_ 9 | ...... | ... | 12_ 13 | 15_ 7 | 13_ 3 | 14 0 | 16_ 0 | 14_ 8 | 9_ 0 |
| బీడు | 6_ 10 | ...... | 20_ 0 | 11_ 0 | 16_ 13 | 13_ 13 | ... | ... | 13_ 15 | 8_12 |
| నాందేడు | 6_ 15 | 14_ 8 | 16_ 8 | 11_ 7 | 13_ 9 | 10_ 0 | ... | ... | 12_ 7 | 8_ 7 |
| పర్భణి | 6_ 14 | ...... | 16_ 13 | 11_ 8 | 15_ 6 | 10_ 11 | ... | ... | 12_ 2 | 9 9 |
| గుల్బర్గా | 6_ 1 | 14_ 8 | 14_ 0 | 7_ 15 | 12_ 9 | 12_ 14 | 12_ 0 | ... | 8_ 13 | 8_ 7 |
| ఉస్మానాబాదు | 7_ 8 | ...... | ... | 12_ 0 | 14_ 14 | 13_ 0 | ... | ... | 13_ 3 | 7 12 |
| రాయచూరు | 6_ 1 | 13_ 2 | 14_ 12 | 7_ 2 | 10_ 9 | 10_ 0 | ... | ... | 7_ 5 | 8_ 6 |
| బీదరు | 6_ 13 | ...... | 12_ 0 | 11_ 5 | 12_ 8 | 13_ 12 | 15_ 4 | ... | 11_ 14 | 8 |

# ౯ యేండ్ల బాలికను చెఱచిన నేరము

## హైకోర్టు వకీలుకు రిమాండు జెయిలు

## కోర్టులో వేలకొలదిమంది ప్రేక్షకులు క్రిక్కిరిసియుండుట

చాదర్ ఘాట్ నివాసియగు మహమ్మదలీ, హైకోర్టు వకీలు తనయింటపనిచేయు పోచాఅను ౯ యేండ్ల బాలికతో బలాత్కారముగ సంభోగించెనని నేరమునకు సంబంధించిన కొన్ని వివరములు యీక్రిందివిధముగ తెలియవచ్చినవి.

ఆ బాలిక తండ్రియగు రాజారాం బాలికను చంకనిడుకొని చాదర్ ఘాట్ పోలీసు స్టేషనుకు వెళ్లి, తనకూతురని నెలనుండి రెండుకూపాయల జీతముపై పైజెప్పిన వకీలుగారింట పనిచేయుటకు ఉంచుటకేర్పాటు చేయబడెననియు, యిట్లుండ పైవకీలుగారిభార్య వేరొకచోటికి వెళ్లినప్పుడు పోచాతప్ప మరెవ్వరును లేని సమయమున ఆబాలికతో మహమ్మదలీ బలాత్కారముగ సంభోగించెననియు. యీవిధముగ బలాత్కారముచేత ఆ బాలిక యొక్క బట్టయంతయు నెత్తుటితో తడిసిపోయినదనియు మొఱపెట్టుకొనెను. పోచా వకీలుగారిని గుర్తు చూపించెను. పోలీసు వారు పంచనామా చేసి వకీలు మహమ్మదలీగారి వయస్సు ౪౫ సంవత్సరములని గుర్తు పెట్టుకొనిరి, పిమ్మట వకీలు గారు రిమాండు జెయిలులో నుంచబడిరి.

నేరస్థుడు న్యాయస్థానములో జమానతుపై తనను వదలిపెట్టవలసినదిగ దరఖాస్తు దాఖలుచేసెను. చేసిన నేరమును ధ్రువపరచుటకు సాక్షులు లేరనియు, తాను గొప్పకుటుంబీకుడు కాబట్టియు. తనవృత్తి గౌరవమైనవృత్తి కాబట్టియు నెక్కడికి కానిపాఱిపోననియు, తనను అపనిందనుండి తప్పించుటకై జమానతు యిప్పించవలసినదనియు దరఖాస్తులో కోరబడెను.

సదర్ అమీన్ హబీబుర్రహ్మాన్ సా॥ తమయొక్క ఫైలులో యిగ్జామినరునుండి సరాఖత్ యింకను పూర్తిగ కాలేదనియు. తనపరిశోధన నేరమును ధ్రువపరచుచున్నదనియు, నేరస్థుని లాగు నెత్తురక్తముచే, పిల్లరక్తముకొఱకుంచుటయును, పిల్లకు నేరస్థునికిమధ్య యేలాటిపగ గాని లేకుండుటయు నేరమును ధ్రువపరచుచున్నదనియు చెప్పిరి.

నేరస్థునితరపు న్యాయవాదివకీల్ మౌల్వీ హకీంసయ్యదలీ సా॥ బహస్ చేసి యిగ్జామినర్ సరాఖత్ యింకను రానందువల్లను, ఒక గౌరవ న్యాయవాదిని యిట్టినింద చేసినట్లు తెలియుటకు కాదనియు, నేరము సాక్షులచే రుజువైనచో అపరాధము నిర్ణయించి జమానత్ పస్తుకొరవించవచ్చుననియు, ప్రస్తుతమునకు మాత్రము జమానతు యిప్పించగలరనియు చెప్పిరి.

ఇందుకు జవాబుగా రక్షక శాఖమదద్గారు యూనుస్ మీర్జాగారు సాక్ష్యము పూర్తి గాగలదనియు, రక్షకశాఖవారితృప్తి పూర్తి ఆయినదనియు చెప్పిరి.

తుదకు అదాలత్ వారు పరిష్కారము చేయుచు నేరము భయంకరముగనున్నదనియు, పోలీసువారు గట్టిగ చెప్పుచున్నారనియు. కాబట్టి జమానత్ కు నేరస్థుడు అర్హుడుగాడనియు, ౧౩౫౦ ఖుర్దాదు ౧౫ నాడు కాలాకొరకై తేదీ యేర్పాటు గావించబడినది కాబట్టి. ఆరోజవరకు నేరస్థుని రిమాండు జెయిలులో నేయుంచి ఆనాటికి పోలీసువారు చాలాన్ పేషుచేయవలసినదనియు ఆజ్ఞయిచ్చిరి.

౧౫ ఖుర్దాదునాడు అవ్వలుతాలుకా, బల్దా ఫౌజ్దారీ గారికోర్టువద్ద వేలకొలదిజనము కూడియుండిరి. పిల్లను కూడ ఆస్పత్రినుండి వదలిపెట్టనున్నారు. ఆపిల్లను వదలిపెట్టిన తర్వాత పిల్లసమక్షములో చాలాన్ పేషు చేయవలసినదని అదాలతువారు చెప్పినట్లు తెలియుచున్నది.

పోచాయింకను చికిత్సాలయములోనేయున్నది. ఉపిలబట్టలు రసాయనపరీక్షకునివద్దనుంచి యింకను తిరిగిరాలేదు. కావున హైకోర్టు వకీలగు మహమ్మదలీగారిపై నేరము విచారణ తేదీ ౨౭ తీర్ ౧౩౫౦ ఫ సా॥ నాటికి మార్చబడినది. ఈ మొకద్దమానువినుటకును అపరాధిని చూచుటకును న్యాయస్థానము క్రిందినుండి పైవరకు జనము క్రిక్కిరిసియుండెను. జనమంతయు మహమ్మదలీ మహమ్మదలీ అనియే అనుకొనుచుండిరి. మహమ్మదలీని జూచుటకు వచ్చుజనమును సహించలేక అపరాధిని గదినుండి తప్పించి అదాలతునాజం జిల్లా వారి యిజ్లాసులోకి తెచ్చిరి. ఆ మొకద్దమా మౌల్వీ అబ్దుల్ మజీదు సా॥ నాజం సుబ్బాంగారి యిజ్లాసులోకి మార్చిరి. మౌల్వీ ముస్తఫా అలీ సా॥ గారు తిరిగి వచ్చేవరకు నాజముమ్వంగారు. మరియు ఫీరిమపరి నాజము మ్వంగారు మొకద్దమావిచారణచేయగల్లరని ప్రకటించబడెను. అపరాధి వకీలు యొక్కముగా సిద్ధమైయున్నను పిల్లయొక్క లిబాధగా చికిత్సాలయములో చికిత్సబొందుచున్నదున పిల్లతరపునకొందరుసాక్షులు చెప్పవలసినవి బట్టలుపరీక్షించుటకుగాను ఆక్కడికిలేవందువల్లను మొకద్దమా ౨౭ తీరు తేదీనాటికి మార్చబడినది.

౨౭ తీరునాటికి సాక్షులని ద్ధమైయుండవలెను. అపరాధిని రిమాండు జైలులో ఉంచగలరు. ఎందుకనగా పిల్లయొక్క లిహీనస్థితిలో ఉన్నది తొందరగా ఆరోగ్యము సమకూరను అని ఆజ్ఞయివ్వబడెను.

ఉస్మానియా దవాఖానా వాజావల్ల ఆబాలికను మొదట చికిత్సాలయములో అసిస్టెంటు సర్జనుఆగు డాక్టరు అబుల్ హసనత్ సా॥ గారు మొదలుచేసిరనియు. తర్వాత మేజర్ ఎం.ఆర్. డబ్ల్యూ హార్డ్ మేమద్ రాజ్ లేడీ డాక్టరు గారి చికిత్సపొందుచున్నదనియు తెలియుచున్నది. చికిత్సాలయము యొక్క సరాఖత్ లో యిట్లు వ్రాసియున్నది.

---

## నిజాం రాష్ట్రములో తెనుగు గ్రంథ నిషేధము

(స్వ. వి.)

ఉపాధ్యాయ గంగాప్రసాదు ఎం.ఏ గారిచే హిందీలో రచింపబడి ధూ. రాజరత్నాచార్యుల వారిచే తెనిగింపబడిన "హిందూధర్మవినాశనము" అనుచిన్న గ్రంథము నిజాము రాష్ట్రములో నిషేధింపబడెనది. ఇది ౧౯౩౯ యీసంవత్సరమే ముద్రింపబడినది. ౫౦౦ ప్రతులకుపైగా ముద్రింపబడెననియు. ప్రతివకటిగ్గపై సాటనియూ ప్రతులన్నియు మొహర్రం రోజులలో నగరవీధులలో చెంచాలా చీకటి పంచిపెట్టబడె ననియును వినుచున్నాము ఈగ్రంథములో హిందూస్త్రీలు తురకల గోరీలను పూజింతురనియు, తాబూతులప్రదక్షణము చేసి మ్రొక్కులు చెల్లింతురనియు, మసీదులలో మంత్రములు చదివించి తమను శ్రేయస్కులగవలెనని యెంచుతూవా సాధించుకొందురనియు నిజగర్భముగుపుత్రులను హిందువులు వదలుకొనవలెననియు ఆ గ్రంథముల వ్రాసినారు. యీ గ్రంథముపపై కెంబెరు ను చెప్పికిన పోలీసువారు జప్తు చేసికొనవలసిన అవసరమైనది. ఇది హైద్రాబాదునగరములో కొందరు హిస్సులో నెచ్చైవందున అప్పుడు శోధించినారు యొక్కప్రతులను జప్తు చేసినారు.

---



---



గోలకొండ పత్రిక

(శ్రీయువనామ సం॥ చైత్ర) బ॥౮

గురువారము



## సహకారశాఖ నివేదిక, ౧౩౪౭ ఫ.

౧౩౪౭ వ ఫః సహకారశాఖ నివేదిక కొన్ని సందర్భములలో పూర్వసంవత్సరములో కంటె కొంచెముయెక్కువ అభివృద్ధిదశను సూచించుచున్నను, సంతృప్తి కల్గించునంతస్థితిని సూచించుటలేదు. ఏఆర్థికదుస్థితివల్ల పూర్వసంవత్సరములో సహకారోద్యమమునకు దెబ్బతగిలియుండెనో, ఆయార్థికదుస్థితి నివేదన వత్సరములో తగ్గియుండనందువల్ల. అపరిస్థితుల వలని అతి దుష్ఫలితములనుండి తప్పించుకొనుటకై సహకారోద్యమము యెక్కువపోరాడ వలసియుండెను.

ఇంతటప్రతికూల పరిస్థితులలోకూడ డొమినియనుబ్యాంకి యొక్క ఆర్థికస్థితి దృఢపరచబడుట సంతోషవిషయమే. బాకీలురాబట్టు కొనుటలో యా బ్యాంకికిపూర్వసంవత్సరములో కంటె రెండింతల అభివృద్ధి కనబడినది. కేంద్రబ్యాంకులు వసూలుకావను అపనమ్మకముగలబాకీలు మునిగినప్పుడు ఆమకొనుటకై లాభమునంతయు వినియోగించుట వివేకమును సూచించుచున్నది. వ్యవసాయకులసహకారసంఘములకునువ్యవసాయకేతరులలో పారిశ్రామికులయొక్కయు, చేతిపనులచే జీవించువారియొక్కయు సహకార సంఘములకును ఆర్థికదుస్థితివల్ల తగిలినదెబ్బచాలగొప్పది. వ్యవసాయమున్ను, చిన్నచిన్న పరిశ్రమలును దేశముయొక్క ఆర్థికజీవనమునందు భాగమునంతయు హొయుప్రకృతి గలవియగుటయే యిందుకుకారణము. నెలజీతములవల్ల జీవించువారిసంఘముల కుమాత్రము ఆర్థికదుస్థితి తగులకుండుట ముఖ్యముగసర్కారి అధికారుల జీతములలో తగ్గింపు అవసరముయొక్కన్యాయతను సమర్థించుచున్నది.

గ్రామగ్రామమందును సహకారసంఘములు అనిన గ్రామస్థులలో అనవసరభీతి యేర్పడుచున్నది. ఈస్థితి తప్పిననేగాని సహకారోద్యమము నూతనజీవనముతో శోభించజాలదు. అట్టిస్థితికిచాలవరకు ఉద్యమము ప్రారంభమునుండియు నడిపింపబడినతీరే కారణము. ఋణగ్రస్తులగు వ్యవసాయకులమధ్య ఋణములనిచ్చుటకు మాత్రము యేర్పడు సంఘములవల్ల ప్రయోజనముండజాలదు. బ్రిటిషుయిండియాలో సహకారనాయకులు దీనిని గుర్తించి ఉద్యమమును ఉత్పత్తి, నిర్మాణముల వైపు మరలించుటకు ప్రయత్నించుచున్నారు. పరిస్థితులబలమే త్వరలో మనరాష్ట్రములోకూడ నీవిషయమును సహకారసంఘములచే గుర్తించునట్లు చేయగలదు.

గ్రామస్థుల ఆదాయాభివృద్ధికిని, వ్యవసాయపరిశ్రమలుచేయు ఉత్పత్తుల యభివృద్ధికిని, ప్రథమమున మూలధనమునకై ఋణము అవసరమేకాని, ఆఋణము ఆప్రయోజనమునకు మాత్రమేవ్యయము చేయబడునట్లు శ్రద్ధవహించనిచో ప్రయోజనములేదు. కాబట్టివ్యవసాయకులును, పరిశ్రమదారులును ఋణములు సంపాదించుకొనుటకై గాక ఉత్పత్తిని సక్రమపద్ధతులపై అభివృద్ధిచేయుటకే సహకారసంఘముల నేర్పరుచుకొని రాబోవులాభమునుబట్టి అవసరమని తోచినంతవరకు మాత్రమే ఆఉత్పత్తి కార్యమునకే ఋణము చేయుచున్న, సహకారోద్యమము నష్టపడజాలదు.

---

## మంచిపనిచేస్తివే మసీదుగప్తీ!

ఈ సంవత్సరము పీర్లపండుగ శ్రీరామనవరాత్రులు వచ్చినై. పీర్లపండుగ అనగా మొహర్రం. అన్ని పండుగలు అప్పుడప్పుడు పీర్లపండుగతో కలిసి వస్తవి. కాని సంక్రాంతి మాత్రము కలిసి రావట్లుంది. అందుకోసమే పీర్లపండుగకు సంక్రాంతికి సంభంధమేమి అంటారు లోకులు. పీర్లపండుగ ౧౦ దినాలు. శ్రీరామనవరాత్రులు ౯ దినాలు. తురకలకు పీర్లపండుగ పీడ్చేదినాలు. హిందువులకు రామనవరాత్రులు ఆనందించుదినాలు: ఒకమాము వారి పెద్దలు ఊరోజుల్లో ఆంత్యకలహాలతో యుద్ధములో నాశనమైనారు. ఇంకొక మరియువారికి ఈరోజుల్లో అవతారపురుషుడు పుట్టి లోకాన్ని ఉద్ధరించినాడు.

* * * * *

కాని ఏమిగ్రహచారమో యేమోమనదేశములో హిందువుల పండుగలు తురకల పండుగలు కలిసి వచ్చినావంటే రెండువర్గాలు దీకొన్నట్టే. ఊరేగింపులు, లాటీలు, రక్తప్రవాహాలు, మున్నగు దుండగములు జరుగుచున్నవి. పండుగలు పర్వాలు పవిత్రదినాలు దేవుని స్మరణచేసి ప్రపంచానికి వుపకారం చేస్తావనేబుద్ధి మనసుపుట్టకు, ఏహో పొత్తు పోని ద్వేషాలు కల్పించుకొని అవకాశము దొరకిందంటే లాటీలు యాడించేదానికే సిద్ధమౌతారు.

* * * * *

బ్రిటిషిండియాలో యిది పరిపాటి అయిపోయింది. పత్రికల్లో ఏటేటాచదివి మనకు సాధారణమై పోయినందేత ఎక్కడనైన ఏపండుగ నాడైన హత్యలైనావంటే మనకాశ్చర్యంలేదు. మనరాష్ట్రములో నేటివరకు హిందూముసల్మానులలో అన్యోన్యమైత్రివుండేది. ఈమైత్రినిచూచి బ్రిటిషిండియాలో అందరూ ఆశ్చర్యపడేది: మననైజాంకలుగూడ యీవిషయాన్ని గర్వముతో దేశదేశాలలో డంకొట్టి చెప్పినారు

* * * * *

కాని ఆకాలముపోయినట్లు కనబడుతుంది. ఈసంవత్సరము యేపత్రికలో జూచినా అల్లరులేగలిగినట్లు వినవస్తుంది. దీనికి కారణము చెప్పేదానికేముంది మనరాష్ట్రములోవుండిన ముసల్మానుమైత్రి యెట్లాంటిదో జూడండి పీర్లపండుగవస్తుందంటే తురకలకంటే హిందువులకే యెక్కువయిచ్చట. దాని యొకయిచూస్తుండేవారు యిండ్లకు సున్నము కొట్టుకనేవారు. ఇంటింటా పక్కీర్లయ్యేవారు. బ్రాహ్మలుకూడా పక్కీర్లయ్యేవారు. ఇంక రెడ్డి, గొల్ల, బోయి. మాదిగకులాలవారి మాటచెప్పవలసినపనిలేదు. నాడెలుయ్యేరటివి మెడను జండే లవలె వేసుకొని యింటింటికి తిరిగి "హాఅలీ!యాయిమాం!" అని అరిచేవారు పీర్లకు నాయంత్రంమైందంటే సాంబ్రాణి ఊదబత్తీలు ధూపంవేసి సాతెహ చదివించి మొల్లాసాబిచ్చిన బూడిద కనురెప్పలకు పూసుకొని యింటికివచ్చేవారు. ఎంతోమంది స్త్రీలు తనపిల్లకలుగాలేదని పీర్లకుమొక్కి కొబ్బరికాయల దండాలు పీర్లకువేసి దారమునుస్త్రీ వేళవచ్చేవారు.

* * * * *

ఆనేకమంది. హిందువులు పీర్లనుతమ యింటివసంరాలోనిలపెట్టేవారు. బారుబట్టలు కట్టించి పెద్దసరిగకు చిన్నసరిగనునాడుబాజాబజంత్రిలతో చాలదర్గాగాఊరేగించేవారు "అలాయి" గుంతకు కట్టలుపన్నివేసి పీర్లముందరిగుండము నిత్యాగ్నిహోత్రముగా కాపాడేవారు, రాత్రిఅయ్యిందంత హిందువులందరు గుంతచుట్టు షైసోజ (షాహుసేన్) దావేజ (భాయిహసన్) యాలీ (యాఅలీ!) యాయిమాం (యాఇమాం) అనే జపధ్యానముచేస్తు కాళ్ళకుగజ్జెలుకూడా కట్టుకొని కార్తీకలు ఫాయ్యేవరకు తాళాగా ఆగివచ్చిన తెప్పకిగేరవరకు దుంకులాడి సగమురాత్రికింటికి వచ్చెయ్యేవారు.

దినంరాత్రులంతా కోలంట్లు (కోలాటములు) స్త్రీలయాటలు వేషాలు తమాషాలు చూడదగినవిగా వుండేది. అలాయి గుండము మస్కరిస్సేవారు హిందువులు. ఆటపాటలుతో వినోదాలచేసి పీర్లనుపూరేగించేవారు హిందువులే. మేళముతప్పెట బాజాలు బజాయించేవారు హిందూమంగలే! దివిటీపట్టేవారు హిందూచాకలే. పక్కీర్లయ్యేవారు హిందువులే! ఫాతెహాలు చదివించేవారు హిందువులే! మాళాలుచేసి పాటిండ్లనుకొని పీర్లకు నైవేద్యమిచ్చి తినేవారు హిందువులే! పీర్లభావిలోనో యేట్లోనో పడేవాడు యేడ్చేవారు హిందువులే! కడపటిదినమువాడు హిందువులకెంతటి ఆయాసమౌతుందో పాపం ఏకధారగా ఏడ్చేవాండ్లను నేను కండ్లారచూచినాను.

* * * * *

ఓముసల్మాను సోదరులారా! నిజముగా మీసోదరులు హిందువులుకారా! మీమతాన్ని హిందువులు ఎన్నడైనా ద్వేషించినారా చెప్పండి. మీగోరీలుకూడ హిందువులు పూజిస్తారు. మీపక్కీర్లకాళ్ళపైబడి మొక్కువారిని నేను హైద్రాబాదులోనే చూపుతాను. ఒకనాడురాత్రిపూట నావెంటరండి. పక్కీర్లవేషము వేసుకొని గల్లీలలో తిరిగేవారికాళ్ళుమొక్కి చేతిలో పైసా పెట్టిపొయ్యే హిందువులను చూపుతాను.

కాని హిందూదేవతలను పూజించేమాట అట్లుండని గౌరవించే ముసల్మానును ఒక్కన్ని చూపించండి. అట్లావుండగా ఇప్పుడుకాలమునూరుతుంది. దానికికారణమేమి. ఇటీవలవచ్చిన మసీదుగష్తీవంటి గష్తీలేదీనికి కారణము.

వనపర్తి హిందువులంత కండ్లారచూస్తావున్నారు. తమదేవుని వూరేగింపును బందుచేసినారు. పీర్లవూరేగింపులు దర్జాగా జరుగుతూవున్నవి. ఏదేమిరా ఇంతఅన్యాయంఅని దవస్సుకుతోచింది. ఇకపీర్లపండుగ మనమెందుకుచెయ్యాలే! మనదేవతలకంటే పీర్లెక్కువా? మనకు సీతారాములు ఎక్కువనా హసన్ హుసేనులు ఎక్కువనాఅనే తర్కంలోకి దిగినారు. చాలగ్రామాలలో యిప్పుడుపీర్లపండుగలు చేయుటింహిందువులు వదలుకున్నారు. పక్కీర్లయ్యేది మానుకున్నారు. ద్వేషభావాలు ప్రారంభమైనవి. కొన్నిగ్రామాలలో చిన్నచిన్న కలహాలైనావని వార్తలువస్తూవున్నవి

* * * * *

మన ఉమారేముజనాబీవారికి కొంచెము దూరదృష్టివుండినా యిట్టిగష్తీలువెంటనే రద్దుచేసిన ఉభయులుమళ్లా యథాపూర్వముగా స్నేహంగావుంటారు. మళ్లాహిందువులంతాపక్కీర్లౌతారు. ఎవ్వరుకాకున్నా రెడ్లుమొదలుకొనిక్రింది జాతులంతా అవుతారు. తిన్నగా ఇస్లాముమతములోకూడా కలుస్తారు. ఇటువంటి మంచిప్రచారమును నిరోధించుటవలన చాలా అనర్థాలు కలుగుతవి. విద్వేషాన్ని లేపి కూర్చొపెట్టినట్లుంది యీగష్తీమాహాత్మ్యము.

---

## చుకారీ జంతువుల శాసనము

### శాసనములో మార్పులుగావించు శాసనము

| | |
|---|---|
| ఏనుగు దానిపిల్ల | ౧_౽_౦ |
| ఒంటె, దానిపిల్ల | ౦_౧౨_౦ |
| గుర్రము, కంచర, కట్టుక దాని పిల్లలు | ౦_౬_౦ |
| దున్నపోతు, ఆవు, ఎద్దు. | ౦_౩_౦ |
| షైవాదిదూడలు | ౦_౨_౦ |
| గాడిద, పందివానిపిల్లలు | ౦_౧_౦౬ |
| గొర్రెలు, పొట్టేళ్లు మేకలు | ౦_౦_౯ |

యీ ప్రకారముగా చుకారీ జంతువుల శాసనములో మార్పులుచేయవలసినదిగా ఉపసంఘమువారునిర్ణయించి తమ నివేదికను మరలశాసనసభ కంపియున్నారు.

---

### జాగీరులో మాఫీలు

నవాబుఅక్బర్ నవాజుజంగు బహద్దర్ జాగీరుదారుగారు తమఅన్ని జాగీరులలోను పంటలు పోయినందున ౧౩౪౭ సాలు ఆబీ, ఖరీఫుపంటలకిస్తులలో ము.ఘ.ర. ప్రభువుగారి ఫర్మానుప్రకారము మాఫీచేయించినారు.

---

### క్రైస్తవోద్యోగులకు సెలవు

ఈస్టు గుడుఫ్రైడేకొరకై సైనిక దళములోని క్రైస్తవోద్యోగులకు ౧౫ఏప్రిలు ౧౫వతేదినుంచి ౧౮వ తేది వరకు సెలవుయివ్వనైనది.

---

# సిలోనులో మలేరియా అనుభవించినవారికి క్వైనాలో నమ్మకము పోయినది

గోల్డుమెడలు

౧౯౩౪ వ సంవత్సరపు ఎచ్. ఓ. ఎచ్. ఫీట్ కమిటీవారు అమీను స్పెసిఫిక్సుకు గాను యిచ్చిన మొదటితరగతి విలువ పసదు.

హైదరాబాదు మునిసిపాలిటి

ఉద్యోగులు అమీను అంటిమలేరియా గోలీలను పంచిపెట్టి, ఉపయోగించి చూచినారు. మంచిగా పని చేసినవి.

మునిసిపల్ కమిషనరుకుబదులు
అసఫ్ నవాజ్‌జంగ్

కొగాలేనుండి మలేరియా అంతకంత కుతగ్గుటపోయి ఆకస్మికముగా హెచ్చుటకు ప్రారంభమైనదని వార్త చేరినది. పోయిన మలేరియా వరల మరలవచ్చుచుండుటచే రోగులకు క్వైనాలో విశ్వాసము పోవుచున్నది.

(౧౯-౧-౩౫ నాటి 'టైమ్సుఆఫ్ఇండియా')

## అమీను ఆంటిమలేరియా గోలీలు

దీర్ఘకాలము బాధించు ఏరునజ్వరములు, విసువక కాచుజ్వరములు--వీటిలో ఎన్నిరకములుకలవో అన్నిరకములను అమీనుఆంటిమలేరియా గోలీలు నయముచేయును. ఈగోలీలు తప్పకనయము చేయును. వాటివలన కలుగుఫలితము స్థిరమైనదనిరుజువుచేయబడినది. ఎప్పటికిని ఒకసీసా దగ్గరవుంచుకోనుము.

ఈప్రత్యేకౌషధములో గురాంచాయక్స్ట్రాక్టు, చిరెటాయక్స్ట్రాక్టు, ఖాక్సిల్‌యక్స్ట్రాక్టు, కార్డామోమిసెనా, సింకోనారబ్, కార్టు, యింకను యితర నిర్దోషములైనఓషధులు చేర్చబడినవి.

ఆర్సెనిక్, స్ట్రిక్నైను, అకోనైటు మొదలగునవి దీనిలోచేర లేదు. క్వైనావల్ల చెవులుకల్గుటతప్పని సరియైనపుడు యీమాత్రలు మిక్కిలి ప్రయోజనకరములు. స్త్రీలుగర్భవతులుగనున్నపుడు గాని ఋతుసంబంధదోషములు గల్గియున్నపుడుగాని యీమాత్రలవాడవచ్చును. శిశువులకు బాలురకుకూడ వీనినివాడుటవల్ల ప్రమాదము లేకుండుటయేగాక లాభముగలదు,

ఉచిత నమూనాకై వ్రాయుడు

డాక్టర్లును, ఫ్యాక్టరీలును, ధర్మసంస్థలుమకోరినచో ౧౦౦ గోలీలనమూనాలు ఉచితముగా పంపబడును. టపాచార్జీలకుగాను "ఏ. అమీన్ అండుకో. బొంబాయి ౩" అను అడ్రెసుకు ౪ అణాల టిక్కెట్లు పంపుడు.

౧౦౦ గోలీలుగలవు.
సీసాఒక టింటికి ౩ల ౧౨.
(ప్యాకింగుచార్జి. టపా చార్జీలువేర)

ఒక్కసారిగా అంతకంటెయెక్కువ సీసాలు తెప్పించుకొనువారిపై ప్యాకింగు టపాచార్జీలు పడవు.

ఏవిషయమున జూచినను యిది క్వైనాకంటె మంచి ఫలితము నిచ్చునది

## ఈ ప్రశంసాపత్రములను, శిఫారసుజాబులనుచదువుము

### ఆంటిమలేరియా గుళికల సర్టిఫికేటు

మ. ఘ. వ. నిజాం రాష్ట్రముయొక్క ఉస్మానియా విశ్వవిద్యాలయపు వ్యాసరచన, తర్జుమాల శాఖనుండి వచ్చినది.

తారీఖు ౩ ఫర్వర్దీ ౧౩౪౩ ఫస్లీ.

ఏ. ఆ. మెహబూబాండెయు.

అమీన్ సాహెబ్ గారి అంటిమలేరియా గుళికలను నేనే స్వయముగ వాడిచూచినాను. నాయింటిలో కొందరికిని వాడినాను. ఇట్లు నేను స్వయముగా పరీక్షచేసి చూచినతర్వాత, మలేరియాజ్వరమును పోగొట్టుటయందు ఈమాత్రలు క్వైనాకంటెను ఎక్కువగుణమిచ్చునవని నేను చెప్పగలుగుచున్నాను. ఈమాత్రలయొక్క గుణములలో అన్నిటికంటె గొప్పది ఏమనగా అవి క్వైనాకలుగజేయు దుష్ఫలితములను ఎంతమాత్రము కలుగజేయవు. కోరం దుకొనిపోవునట్లుచేయుట, చెవులలోశబ్దము, వికారము మొదలగు దుర్గుణములు క్వైనాకు గలవు.

దస్తఖతు—వి. హానర్
వ్యాసరచన తర్జుమాలశాఖ,
ఉస్మానియా విశ్వవిద్యాలయము,
హైదరాబాదు-దక్కన్.

### ఇంటర్నేషనల్ కంపెనీడైరెక్టరు, యస్. ఎ. కాజ్మిగారు

హైదరాబాదు-దక్కన్
౫ ఫిబ్రవరి 1934

కొన్ని నెలలక్రింద నేనుఎక్కువ మలేరియాజ్వరముచే పడికట్టియున్నప్పుడుహామీద్ అహమద్‌గారు నాకు అమీనుగారి అంటిమలేరియాగుళికల ప్యాకెట్టు కొకదానిని దయతో నిచ్చిరి. నేనుగుళికలను వాడితిని. ఆదేమియాశ్చర్యమో ఆనాటి సాయంకాలమునకే నాజ్వరము తగ్గిపోయెను. నేనుగుళికలను నాబిడ్డలకును, కొందఱుమిత్రులకును నిచ్చితిని. అన్నిసందర్భములలోను గుళికలు చాల ఉపయోగకారులుగ కనబడెను. ఈమందును నిర్భయముగ వాడవచ్చుననియు, ఈగుళికలను పుచ్చుకొనవలసినంతకంటె యెక్కువపుచ్చుకొనినను క్వైనాపుచ్చుకొనినప్పుడువలె రోగికి చెడుఫలితమేమియు కలుగదనియు తెలిసికొనుటకు సంతోషముగుచున్నది.

అట్టి ఉపయోగకరమగు భారతదేశీయౌషధమును తయారుచేసిన ఏ. అమీన్ కంపెనీ అండుకో, బొంబాయివారిని నేను హృదయపూర్వకముగా అభినందించుచున్నాను. ఈమందు మానవులను మలేరియావ్యాధి రాకుండజేయుటకు గొప్ప వరప్రసాదముగ నుండగలదని నమ్ముచున్నాను.

దస్తఖతు/—యస్. ఏ. కాజ్మి

౩ ఫర్వర్దీ ౧౩౪౩ ఫసలీ    హైదరాబాదు (దక్కన్)

నేను అంటిమలేరియా మాత్రలను నాసేవకులలో ఒకరిచేతను, నా బంధువులలో ఒకరిచేతను ఉపయోగించునట్లు చేసితిని.

ఇద్దరికిని మేలుఅయినది. ఈమాత్రలు మలేరియా జ్వరములో తక్షణ మంచిగుణము నిచ్చును. అందులో వేంకోనా కలిసియున్నను, అమందులో దానిగుణములు చాలవరకు శుద్ధి చేయబడినవి కాబట్టి భయములేదు.

దస్తఖతు/-మహమ్మద్ బాకార్
మెహతెమీం, యూనాని డిస్పెన్సరీ

మ. ఘ. వ. నిజాం ప్రభుత్వమువారి మైసారం యూనాని దవాఖానా శాఖనుండి వచ్చినది
తేది ౩ ఫర్వర్దీ ౧౩౪౩ ఫసలీ

ఇందువలన సనదు యిచ్చుట యేమనగా అంటి మలేరియాగుళికలు రోగులచే ఉపయోగింపబడెను. చాలా మంది రోగులకు లాభముకలిగెను. ఈగుళికలను కనిపెట్టినవారు ప్రతియొకసారి తీసికొనవలసిన పరిమాణమును తగ్గించి నిర్ణయించుట మంచిది.

దస్తఖతు/ మెహతెమీం, షఫాఖానా.

కార్మైపురము
హైదరాబాదు (దక్కన్)
౧ ఫిబ్రవరి ౧౯౩౪

నేను అమీనుగారి అంటి మలేరియా గుళికలను మలేరియానివారణకై శిశువులకును పెద్దవారికినికూడ ఉపయోగించి చూచినాను.

ఆగుళికలను ఉపయోగించి చూచుటవలన నాకు మొత్తముమీద కలిగిన అభిప్రాయ మేమనగా అవి అప్పుడప్పుడు వచ్చు జ్వరములు ప్రారంభదశలో నున్నప్పుడు వాటినిరాకుండ నివారణచేయుటలో మంచిపని చేయును.

దస్తఖతు/-మహమ్మద్ అలీఖాన్
జిల్లా వైద్యశాలల డైరెక్టరు
మ. ఘ. వ. నిజాం ప్రభుత్వము.

యూనాని దవాఖానాశాఖ హరిబావులీ,
మ. ఘ. వ. నిజాంప్రభుత్వము

నెం. ౧౭౯    తారీఖు ౩ ఫర్వర్దీ ౧౩౪౩ ఫసలీ

ఇందువలన యివ్వబడుసనదు ఏమనగా ఏ. అమీనుకంపెనీవారి అంటిమలేరియాగుళికలు మలబద్ధకము నివారణమైన పిమ్మట రోగులచే ఉపయోగించబడినవి. యివి ప్రత్యేకముగా లాభకరములని కనపడినవి. అంతే.

దస్తఖతు/— మహమ్మద్ ఫఖ్రుద్దీన్‌ఖాన్
ఇన్స్పెక్టర్ షఫాఖానా
(యూనాని, హరిబావులీ)
మ. ఘ. వ. నిజాంప్రభుత్వము.

## ఏ. అమీన్ అండుకో

౧౧౪, ఫ్రీరోడ్డు, కార్నాక్ బందర్, బొంబాయి ౩,
టెలిఫోను నెం., ౨౦౭౧౧, ౭౨౭౨౯
టెలిగ్రాం అంటిక్వినిన్

## బ్రాంచి:—యక్సెల్సియర్ బిల్డింగు, హైదరాబాదు (దక్కన్)

# ది సెంట్రల్ బ్యాంకు ఆఫ్ ఇండియా, లిమిటెడ్.

హెడ్ ఆఫీసు:—బొంబాయి

బ్రాంచీలు,—అహమ్మదాబాదు; అమృతసరు; ఆగ్రా; ఔరంగాబాదు; కలకత్తా; కాన్పూరు; ఢిల్లీ; గోరఖ్పూరు; హాపూరు; హైదరాబాదు-దక్కన్; హైదరాబాదు-సింధు; జాల్నా; జంవగర్; కరాచి; లాహోరు; లాటూరు; లక్నో అయోధ్యాపురు; రంగూను; రాయచూరు; శైలు; శంభేర చెరువు; సికింద్రాబాదు; సూరతు; వరంగల్లు.

ఇంతేగాక యింకను ౩౦ పేఅఫీసులు ఉన్నవి.

౧౫—౧౧—౧౯౩౮ నాడు లెక్కలలోనుండిన

| అప్పులు | | ఆస్తి | |
|---|---|---|---|
| వాటాలు నైకొనబడిన మూలధనము... | రూ ౩,౩౬,౦౧,౦౦౦ | నగదు డిక్రెట్లు. ప్రభుత్వముపై ఓవరు డ్రాఫ్టులు, ఇతరములైన అథరైజ్డు సెక్యూరిటీలు. | రూ. ౩,౯౫,౫౫,౦౦౦ |
| చెల్లింపబడిన మూలధనపువాటాలు... | రూ ౧,౩౭,౦౦,౦౦౦ | ప్రభుత్వపు, మరియు యితర సెక్యూరిటీలపై అప్పులు | రూ. ౩,౫౪,౭౪,౦౦౦ |
| రిజర్వు మరియు కంటిజెన్సీఫండు | రూ ౮౦,౦౦,౦౦౦ | డిస్కౌంటుచేయబడిన బిల్లులు ... | రూ. ౭౭,౩౫,౦౦౦ |
| డిపాజిట్లు, బ్యాంకులకును, చెల్లింపదగిన బిల్లులకును, యింకను యితరములకును సంబంధించిన అప్పు | రూ ౨౫,౦౫,౯౦,౦౦౦ | భూములు, బిల్డింగులు | ౧,౧౫,౦౭,౦౦౦ |
| బ్రాంచిలెక్కల సర్దుబాటులతో వివిధములు ... ... | రూ ౪,౦౦,౦౭,౦౦౦ | బ్రాంచిలెక్కల సర్దుబాటులతోసహా వివిధములు ... ... | రూ. ౨,౩౩,౧౪,౦౦౦ |
| | | దగ్గఱను, బ్యాంకులలోను, యుద్ధపుఅప్పులబాండురూపమునను, గవర్నమెంటు పేపరురూపమునను, ట్రెజరీబిల్లుల రూపమునను, వాటాలరూపమునను, డిబెంచర్లరూపమునను. ఇతరరూపమున నున్న నగదు .................. | రూ. ౧౭,౬౭,౫౫,౦౦౦ |
| | రూ. ౩౦,౭౩,౯౪౦౦౦ | | రూ. ౩౦,౭౩,౯౪,౦౦౦. |

ప్రతివిధమైనమారకము, బ్యాంకింగువ్యాపారము జరుపబడును.

ఇ. ఖాన్,
ఏజంటు,
హైదరాబాదు—దక్కన్ బ్రాంచి.









# గోలకొండపత్రికా ప్రచురములు

| | |
|---|---|
| ఉచ్చల విషాదనాటకము | 0-12-0 |
| కృష్ణార్జున సంవాదము | 0-6-0 |
| సంఘోద్ధరణ | 0-6-0 |
| కర్నూలురాజ వంశావళి | 0-2-0 |
| కృష్ణాలహరి | 0-1-0 |
| సుధాలహరి | 0-2-0 |
| బమ్మెరపోతనామాహాత్మ్యవిజయము (హరికథ) | 0-1-6 |
| రఘునాథ | 0-1-0 |
| చారుమీనారు | 0-1-0 |
| పంచముల చరిత్ర | 0-3-0 |
| హాలీకల్లారు జంత్రి | 0-2-0 |
| కార్డ్లు ఖుబాలియ్యతులు 100 కి | 2-0-0 |
| ప్రాంసరీనోట్లు „ | 2-0-0 |

నోటు:—హిందువులపండుగల పత్రికలు ఖర్చైపోయినవి.

REG. No. N. 45

Reg. No. M. 2185

STAMP

Printed and published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Editor K. Balakrishna Reddy